ఓం

శ్రీ గురుభ్యో నమః

శ్రీ శ్రీధర శివరామ దీక్షితాచల గురు సాంప్రదాయము

# శ్రీ భద్రాద్రిరామ శతకము

గ్రంధకర్త: శ్రీమత్ పరశురామ నరసింహదాసు

# అవతారిక

శ్రీ శ్రీధర శివరామ దీక్షితాచల గురు పీఠ సాంప్రదాయకులు, ప్రకృతి పురుషద్వయ

దోషరహితుండును త్రిగుణాతీతుండును క్షరాక్షరోపాది విలక్షణుండునగు

శ్రీ కంబాలూరి అప్పారావు వారి కరకమల సంజాతులైన,

శ్రీమత్పరశురామనరసింహదాసు వారు వేదాంతార్థ సారము

లెస్సగా సంగ్రహించి"శ్రీభద్రాద్రిరామశతకము" అను ఈ సీసశతకము వ్రాసిరి.

**శ్రీ అచలబోధ కలియుగ గురుపరంపర**

| శ్రీ బ్రహ్మానంద స్వామి |
| --- |
| శ్రీ అమలానందస్వామి |
| శ్రీ దత్తానందస్వామి |
| శ్రీ రామానందస్వామి |
| శ్రీ జ్ఞానానందస్వామి |
| శ్రీ కబీరుదాసు |
| శ్రీ సహజానందులు |
| శ్రీ రామావధూత |
| శ్రీ అంబికాశివయోగి |
| శ్రీ వేమన్నగురువరుండు – వేమన |
| శ్రీ మారునూరునంబిగారు |
| శ్రీ తిరువెంకటఆచార్యులు |
| శ్రీ అతీతఅవదూత |
| శ్రీ తిరుప్పాళి యాళ్వారు |
| శ్రీ శ్రీధరస్వామి |
| శ్రీ శివరామదీక్షితులు |
| శ్రీ కంబాలూరిఅప్పారావు |
| శ్రీ పరశురామనరసింహదాసు మరియు శ్రీ పరశురామసీతారామ స్వామి |
| శ్రీ శేషమాంబ మరియు శ్రీ మద్భాగవత కృష్ణదేశిక ప్రభువరులు |
| శ్రీ భారలింగప్రభువు |
| శ్రీ రామబ్రంహ్మాం |
| శ్రీ సత్యమాంబ |
| శ్రీ సుగుణాకరప్రభువు |
| శ్రీ మాధవదేశికులు |
| శ్రీ రామచంద్రారావు గారు  మరియు శ్రీ బత్తుల రామ చంద్రారెడ్డి గారు |
| శ్రీ అన్నమరాజు సుగుణాకర రావు గారు మరియు శ్రీ మద్దిలేటి గారు |

## పీఠాధిపతి

# శ్రీ అన్నమరాజు సుగుణాకరరావు

### వెలివేర్తి గురు పీఠం

### గ్రామం వెలివేర్తి, మండలం శంకరుపల్లి, రంగారెడ్డి జిల్లా.

### ఆంధ్రప్రదేశ్

# శ్రీ భద్రాద్రిరామ శతకము

1. | సీ|| శ్రీ గణాధీశుని సేవించి వినుతించి భారతీనాథుని ప్రస్తుతించి |
శ్రీపతి పాదముల్ చిత్తంబులో నుంచి సాంబమూర్తిని సదా సంస్మరించి |
వాసవాద్యఖిల దేవతలను ప్రార్థించి సనకాది మౌనులసన్నుతించి |
గురుపదాంభుజముల గొనియాడి పూజించి వేదాంతవేద్యుల విన్నవించి |
|తేగీ|| యాంధ్రగీర్వాణ కవులనేనాశ్రయించి చేయబూనితి శతకంబు చిత్తగించు |
రమ్యగుణధామ భద్రాద్రిరామ పరశురామ నరసింహదాస సంరక్షితాహ్వ ||

2. | సీ|| శ్రీ జానకీరామ సేవకసూత్రామ రఘుకులాంబుధి సోమ యఘువిరామ|
పతిత పావననామ భవ్యపరంధామ కరుణాలలామ సంగ్రామభీమ |
వారివాహశ్యామ వరతులసీధామ యమితవిక్రమ త్రిలోకాభిరామ |
విజితభార్గవరామ వినుతమౌనిస్తోమ సంపూర్ణకామ సత్సార్వభౌమ |
|తేగీ|| భక్తమందార నగధీర భయవిధూర దనుజసంహార విమల వేదాంతసార |
రమ్యగుణధామ భద్రాద్రిరామ పరశురామ నరసింహదాస సంరక్షితాహ్వ ||

3. | సీ|| వేదముల్ వివరించి విననేర్చుకోలేదు శాస్త్రపురాణముల్ చదవలేదు |
యాంధ్రగీర్వాణంబు లభ్యసింపగలేదు వేదాంతమార్గముల్ వెదుకలేదు|
చూచి ఛందంబులు శోధించగాలేదు సాదుజనుల పొందు సలుపలేదు |
విలసత్తలంకార విధము చూడగలేదు క్కావ్యనాటకములు గానలేదు |
|తేగీ|| నీ కటాక్షంబు నామీదమిగులగలుగ జేయబూనితి నీమీద సీసశతకము |
తప్పులేకుండ దయజేసి ధరణియందు కవిజనంబులు మెచ్చవిఖ్యాతిజేయు |

4. | సీ | | నీలమేఘముతీరు నీ శరీరంబును పద్మరాగచ్ఛాయ పదయుగములు |
పన్నగేంద్రునిసమ బాహుదండంబులు సింహమధ్యమును హసించునడుము |
తిలపుష్పమునుబోలు తీరైన నాసికం బొప్పు విద్రుమకాంతి యోష్ఠములను |
కమలంబులను మించు విమలనేత్రంబులు పున్నమచంద్రునిబోలుమోము |
|తేగీ | |మదనశతకోటి సుందరమైన చక్కదనము వర్ణింప బ్రహ్మకు దరముగాదు |
రమ్యగుణధామ భద్రాద్రిరామ పరశురామ నరసింహదాస సంరక్షితాహ్వ | |

5. | సీ | | కేశవగోవింద కృష్ణదామోదర నారాయణాచ్యుత నారసింహ |
మధుసూదన త్రివిక్రమ జనార్ధన ముకుంద వైకుంఠవామన వాసుదేవ |
పుండరీకదళాక్ష పురుషోత్త మోపేంద్ర పరమాత్మ పరమేశ పద్మనాభ |
మాధవాధోక్షజమధువైరి శ్రీహరి విష్ణు విశ్వంభర విశ్వనాథ |
|తేగీ | | శ్రీధరానంతఛిద్రూప శ్రీనివాస పుణ్యచారిత్ర శుకనుత పుణ్యపురుష |
రమ్యగుణధామ భద్రాద్రిరామ పరశురామ నరసింహదాస సంరక్షితాహ్వ | |

6. | సీ | | నిత్యనిరాకార నిరుపద్రవాఖండ నిర్మల నిర్గుణ నిష్కలంక |
నిష్కర్మ నిష్క్రియ నిస్సంగ నిర్ద్వంద్వ నిరుపమ నీరంధ్ర నిర్వికల్ప |
నిష్ప్రపంచావ్యయ నిశ్చల నిశబ్ద నిర్వచనానంద నిర్వికార |
నిర్విశేషాచింత్య నిరతిశయానంద స్వస్వరూపంబు నిస్సంశయముగ |
|తేగీ | |వారిజాసన కైలాసవాస వాసవాదులకునైన వర్ణింపనలవిగాదు |

7. | సీ | | ఆత్మయందున యేకమాకాశముదయించె ఆకాశమందనిలంబు బుట్టె |
అనిలంబువల్లను అగ్నిహోత్రుడు బుట్టె అగ్నిహోత్రమువల్ల అప్పుబుట్టె |
అప్పువల్లను మహీయవనిస్థలియ బుట్టెనవనియందోషధులమర బుట్టె |
నోషధులందు నొనర నన్నము బుట్టె నన్నమందున నరులాది సకల |
|తేగీ | |జంతుజాలంబులాయె నీజగయుగమ్ములాయె నీరీతి పరమాత్మమాయవలన |రమ్య | |

8. | సీ|| నరుడు తొంబైయారునంగుళా లెనిమిది జానలపొడవు నాల్జానలెళుపు |
యిట్లు ముప్పైమూడుకోట్ల రోమంబులువెలయ డెబ్బదిరెండువేల నాళ్ళు |
ఎముకలరువదియారు అమరి తొంబది రెండు కీళ్ళు ముప్పది మూళ్ళపేగు |
శేరుగుండె నర్ధశేరురుధిరంబుమణుగునాలుగు శేర్లుమాంసముండు |
|తేగీ||సోలపైత్యంబు శ్లేష్మమర్సోలెడుండు నీప్రకారంబు దేహంబులన్ని చూడ |రమ్య||

9. | సీ|| జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదు శబ్దాదులైదు కోశంబులైదు |
కరణముల్ నాల్గు రాగాదులెన్మిది పదినాళ్ళువాయువులు పద్నాలుగు నేడు |
ధాతువు లైదుభూతము లారుచక్రములు మలములు మూడవస్థలును నైదు |
మూడు మండలములు మూడీషణంబులు మూడువ్యాధులు గుణాల్మూడు
|తేగీ|| రెండు తనువులను గూడి షణ్ణవత్యాది తత్వ సాక్షి రూపుడవైనావు సత్యముగను|రమ్య

10. | సీ|| వసుధజలంబగ్ని వాయువాకాశంబు లివి పంచభూతముల్వీటియందు |
రక్తశుభ్రాసీతయుక్త ధూమ్రసునీలములు గంధరసరూపములును స్పర్శ |
శబ్దంబులును క్రియాశక్తి జ్ఞానేచ్చాది శక్తులు వరపరాశక్తి ల – వ – ర – య – అ |
అజవిష్ణు త్రియంబకేశ్వర సదాశివులు నొండొంటికి స్థిరముగాను |
|తేగీ||వర్ణగుణశక్తి బీజదేవతలునుండు నీకు నేగుణములులేవునిర్మలుడవు|రమ్య ||

11. | సీ|| రూఢి శబ్ద స్పర్శ రూపముల్ రస గంధములునైదు పృథ్వియందలరి యుండు |
రస రూపస్పర్శ శబ్దంబులు నాలుగు జలమందు జనితమై చెలగియుండు |
నగ్నిహోత్రమునందు నమరి రూప స్పర్శ శబ్దముల్ మూడు నిశ్చయముగాను |
వాయువందు స్పర్శవరశబ్దములు రెండు నంబరమందు శబ్దంబునొక్కటి |
|తేగీ|| యొక్కటియూ లేక దిక్కులు పిక్కటిల్లగ వెలుగుచున్నావు లోపలవెలుపలనక |రమ్య

12. |సీ|| ఆకాశాపంచక మంతరింద్రియములు ప్రాణాదులును వాయుపంచకంబు |
జ్ఞానేంద్రియములు వైశ్వానరపంచక మప్పుపంచకము శబ్దాదులైదు |
కర్మేంద్రియములైదు కడు భూమిపంచకం బిట్టు లిరువది యైదింద్రియములు |
యివి యాత్మగాదని యిన్నింటినెరిగెడు యెరుకయే పరమాత్మయని యెరింగి
|తేగీ|| సాంఖ్యయోగంబు సాధించి సజ్జనుండు ముక్తిజెందును మీ పాదభక్తితోనూ|రమ్య ||

13. |సీ|| జ్ఞానసమానముల్ వీనులుశబ్దంబు వాగ్వ్యోమయంశముల్ వరుసనాయె |
మనసు వ్యానము చర్మమును స్పర్శకరములు వాయువాంశంబులు వరుసనాయె|
రూఢిబుద్ధియు దానరూపాక్షి పాదముల్ వహ్నియంశంబులు వరుసనాయె|
చిత్తంబు ప్రాణంబు జిహ్వాశిశ్నరసంబు వారి యంశంబులు వరుసనాయె |
|తేగీ|| గంధహంకారముల పానఘ్రాణగుదములాయే భూయంశలిట్లు నీమాయవలన |రమ్య

14. |సీ|| నరములస్థులు చర్మ నఖ రోమ మాంసముల్ భూగుణంబులు స్వేదమూత్రశ్లేష్మ |
ములు శుక్లశోణితంబులు జలగుణములు క్షుత్పిపాసాలస్య సుషుప్తిసంగమములు |
వహ్నిగుణములు చలనధావనకంప నా కుంచన ప్రసరణాధికములు |
పవనాది గుణములు భయకామమోహముల్ క్రోధ లజ్జయు నభోగుణములిట్టి |
|తేగీ|| పంచభూతంశ గుణములు బారదోలి నీ స్వరూపంబు గనువాడు నిర్మలుడు |రమ్య|

15. |సీ|| అన్నరసంబుతోనైన శోణితశుక్లమయమ్మైన ఈ దేహ మన్నమయము |
పంచప్రాణంబులు ప్రబలి కర్మేంద్రియ పంచకంబునుగూడి ప్రాణమయము |
జ్ఞానేంద్రియములైదు మానసంబొక్కటి కూడియైనది మనః కోశమయము |
వెలగిజ్ఞానేంద్రియంబులు బుద్ధియునుగూడి విజ్ఞానమయము యవిద్యయందు |
|తేగీ||మనసుగలశిన యానందమయము లిట్లు పంచకోశంబులకు సాక్షిపరుడువీవె |రమ్య

16. |సీ|| ప్రాణుండు హృదయాబ్జ పదమందువాసమై నాణెపుశ్వాసముల్ నడుపుచుండు |
పాయు వస్థలయందపానుండు మలమూత్రముల విసర్జన జేసి మెలగియుండు|
నాభియందు సమానము యుండి సమముగా నాళ్ళ నన్నింటిని నడుపుచుండు |
ఘనయుదానుండును కంఠమందుననుండి నలవైఖరీ పలుకులు పలకజేయు|
|తేగీ||వ్యానపవనంబు దేహసర్వాంగములను నిండి శీతోష్ణస్పర్శల నెరుగజేయు |రమ్య ||

17. |సీ|| నాగుండు యుద్గారణంబు చేయించును మేలుగా కూర్మడు నీమలనంబు |
చేయించు కృకురుండు చేరితుమ్మించును జితదేవదత్తుండు జ్రుంభణంబు|
మరణ దేహములందు మరిగి ధనంజయుండతి శోషబుట్టించి యణగజేయు |
ఘనముగా అంతర్యామియును ప్రపంచకుడను వాయువుల్ నరునకు వాహనముగ
|తేగీ|| యుండు వజ్రుండు ముఖ్యుండు యొనరుగాను కీళ్ళు కీళ్ళందునుండును చీలపగది|

18. |సీ|| మరి రసరుధిరముల్ మాంసము మేధస్సు మజ్జాస్థిరేతముల్ మానితముగ |
నివిసప్తధాతువుల్ నిబిడీకృతంబుగా దేహికావరణమై దేహమాయె |
పాదాది మస్తక పర్యంతమును నిండి ప్రకృతి భేదంబుల ప్రబలమాయె |
స్థూలమై దీర్ఘమై సూక్ష్మమై నటియించి నందందు మరణంబు నొందుచుండు |
|తేగీ|| నిట్టి దేహంబులందాసలేమిలేక నిన్నుగనువాడు ముని జనసన్నితుండు |రమ్య ||

19. |సీ|| జ్ఞానేంద్రియంబులు కర్మేంద్రియములంత లింద్రియంబులు విషయేంద్రియములు |
ప్రాణాదులును గూడి పరగనిరువదియైదు తత్వంబులును స్థూల తనువునయ్యె |
బాహ్యేంద్రియంబులు పదిప్రాణములునైదు ధీమనంబులు సూక్ష్మ దేహమయ్యె |
ఈ శరీరద్వయ హేతుకానాద్య విద్యావృతమై కారణాంగమయ్యె|
|తేగీ|| మూడుదేహంబులకు నాదిమూలమైన క్షరున కక్షరునకు విలక్షణుడవీవె |రమ్య ||

20. | సీ|| శబ్దంబుచెవులకు స్పర్శచర్మంబున కక్షికిరూపు జిహ్వకురసంబు |
ముక్కుకుగంధంబు వాక్కుకువచనంబు కరములకుదానంబు చరణములకు |
గమనంబు గుదమునకు గలిగి విసర్జన గుహ్యముకానంద గుణముగల్గు |
మనసుచలించును మతినిశ్చయించును చిత్తంబుచింతించు మొత్తముగను |
|తేగీ|| మరియహంకారమున కభిమానపడును నిన్ని టెరిగిన తెలివి దానెరుగవలయు |రమ్య ||

21. | సీ|| శ్రవణంబులకును దిక్చర్మంబునకు వాయు చక్షువులకు జగచ్చక్షువరుణు |
డును జిహ్వకును ఘ్రాణమున కశ్వినీసురుల్ వాగింద్రియమునకు వహ్నిహస్త |
ములకు నింద్రుండు పాదములకు నుపేంద్రుండు గుదమునకు మృత్యువు గుహ్యమునకు
చతురాననుడు మానసమునకు చంద్రుడు బుద్ధికి పరమేష్టి శుద్ధ చిత్త|
|తేగీ|| మునకు జీవుండహంకారమునకు శివుడు తెలియవలె నీచతుర్దశ దేవతలను |రమ్య

22. | సీ|| పంచవింశతితత్వ పరిపూర్ణమైనట్టి స్థూలదేహమునందు సురుచిరముగ |
రసస్పర్శలును రూప రసగంధవచన దాన గమనోత్సర్జనానందములను |
మానసహంకార మతి చిత్తముల గూడి జీవుడు ముఖమున జేరినిలిచి |
విశ్వనామముజెంది వెర్వేర విభజించి సకల వ్యాపారముల్ సలుపుచుండు |
|తేగీ|| నదియు జాగ్రదావస్థయు ననుదినంబు జనితమై జనుచుండు జన్మరహిత |రమ్య ||

23. | సీ|| శబ్దాది విషయ పంచకము వాగాది పంచకము నీ పదియును నిచ్చటనునిల్పి |
మానసాహంకార మతిచిత్తములగూడి సప్తదశకతత్వ సంజ్ఞ సూక్ష్మదేహమందున
కంఠదేశంబుననుజేరి నిలిచి కొంచము సేపు నిదురచెంది |
జాగ్రత్తయందు తాజరిపినట్లుక్రియల్ జేసి మేలుకొని చూడలేశమైన |
|తేగీ||లేదుగనుకను స్వప్నంబనాది పురుష సత్యమిదిగాదు జనితమై జనుచునుండు |రమ్య

24. | సీ|| కంఠదేశమున నహంకార చిత్తములుంచి ధీమనంబుల రెంట్ని దీసుకొననియు |
కారణదేహ హృత్కమలమందుజేరి యజ్ఞానసన్నిధియందు నిలిచి |
నది సుషుప్తనబడు నచట రెంటినినుంచి తానవిద్యనుగూడి లీనమైన |
నదియుగాఢ సుషుప్తియనబడు మహిమీద సర్వంబు బారిన స్ఫురణ దప్పి |
|తేగీ|| యుండుట తుర్యంబటంచును యోగివరులు చాటు చుందురు జనితమై జనుచునుండు

25. | సీ|| సత్యవ్రతాచార సంపన్నుడైయుండి సత్కర్మక్రియలెల్ల సలుపుచుండు |
తపము మౌనంబు యుత్సాహంబు గలిగుండు ధర్మమార్గంబులు దలుచుచుండు |
శమదమంబులు శాంతిశ్రద్దలు గలిగుండు శాస్త్రపురాణముల్ చదువుచుండు|
ధ్యానసుజ్ఞానసన్మానముల్ గలిగుండు శ్రేష్ఠదానంబులు సేయుచుండు |
|తేగీ|| ధైర్యనిశ్చయబుద్ధి సద్భక్తినుండు కుజనదూరుండు సాత్వికగుణయుతుండు |రమ్య ||

26. | సీ|| కామంబు క్రోధంబు గర్వంబు గల్గుట కామ్యసంగతుల హంకారపడుట |
పరరాష్ట్రముల మీద పంతంబు సేయుట పరధనంబులమీద భ్రాంతిపడుట |
వారకాంతల పొందు వాంఛింపుచుండుట నేరములెన్నైగోరి వినుట |
డంబముద్యోగ మార్గంబుల మెలగుట యుద్ధరంగమున సంసిద్ధమగుట |
|తేగీ||భోగ భాగ్యంబు గోరుట పొగడుకొనుట లాలితంబుగ రాజసలక్షణములు |రమ్య ||

27. | సీ|| అజ్ఞానవృత్తి మోహాంధకారయుతుండు భూరి నిద్రాసక్తి బొందియుండు |
యెదురు తన్నేరుగక విదలించి యదరించి కొట్టును తిట్టును కోపపడును|
అతి భోజనప్రియుండతి పానవశ్యుండు పాతకంబులబట్టు బడుచునుండు |
దూషింపుచుండు దుర్భాషలు భాషించు రోషంబులాడిన రోయకుండు |
|తేగీ|| బుద్ధిహీనుండు సంసార బద్ధకుండు కుటిల సంగుండు తామసగుణరతుండు |రమ్య

28. |సీ|| సాత్వికగుణునికి సగము రాజసము రాజసములో సగము తామసముయుండు |
రాజసగుణునికర్ధము సత్వమందుండు సత్వంబులో తామసముసగంబు |
తామసగుణునికర్ధము రాజసము రాజసమునకు సత్వంబు సగముయుండు |
త్రిగుణంబు లీరీతి దేహంబులందుండు సాత్విక గుణముండు సజ్జనుండు |
|తేగీ|| గురుముఖంబున మీరూప మెరుగుచుండు త్రిగుణరహితుండు వర్ణింప నగణితుండు|

29. |సీ|| గాంధారి హస్తిని ఘననాళములు రెండు నేత్రద్వయంబున నిలచియుండు |
నమరి పూషాలంబ నాళంబులును రెండు కర్ణ ద్వయంబున గలిగియుండు |
వర జిహ్వనాడియు వక్త్రంబు నందుండు నాభిని శంఖిని నాళముండు |
కులహ శినీవాలి గూడి రాత్నాహ్వాయు గుద గుహ్యములయందు కుదిరియుండు |
|తేగీ|| కంఠమందు పయస్విని గలిగియుండు క్షుధయు తృష్ణయు నెరిగింపుచుండు నెపుడు|

30. |సీ|| ఇడయు పింగళయును కుడియెడమలనుండు నడుమసూక్ష్మసుషుమ్ననాడియుండు
యానాడిరంధ్ర మధ్యమునందు సూర్యసోమాగ్ని విద్యాక్షరమాయయాత్మ |
సప్తసముద్రముల్ సప్తపర్వతములు చతురాగమంబులు శాస్త్రములును |
పంచభూతములు సప్తద్వీపములు లోకములు గుణంబులు మంత్రములును కళలు |
|తేగీ|| బిందునాదము దిగ్వాయుబీజమాది సకల దృశ్యపదార్థముల్ సమతనుండు |రమ్య |

31. |సీ|| అతలంబు పాదముల్ వితలంబుగుల్భలు జంఘలు సుతలంబు జానులందు |
యుండుతలాతలం బూరుయుగ్మము మహా తలముగుహ్యము రసాతలముయుండు|
కటిని పాతాళలోకము నాభిభూలోకముండు భువర్లోకముదరమందు |
స్వర్గంబుహృదియు వక్షము మహర్లోకంబు ఘనజనలోకంబు గళము బొమల |
|తేగీ|| మధ్యమందు తపోలోక మమరుమూర్ధిని సత్యలోకంబు నీ నివాసస్థలంబు |రమ్య ||

32. | సీ|| భ్రూమధ్యమున జంభభేదిపురంబుండు నగ్ని దేవుని పురంబక్షియందు |
దక్షిణకర్ణమందంతకుని పురంబు తత్పార్శ్వమున యాతుధానవపురము|
పరగుపృష్టము నందు వరుణుని నగరంబు పవనపురంబు నాపార్శ్వమందు |
వామకర్ణము నందువరకుబేరపురంబు హరునిపురంబు వామాక్షియందు |
|తేగీ|| శిరము నడుమనుయుండు సుస్థిరముగాను కుంఠితముగాని నీదు వైకుంఠపురము|

33. | సీ|| పృథ్వీజీవులకెల్ల క్షుధతృష్ణలును రెండు ప్రాణధర్మములని పలుకబడెను |
శోకమోహంబులు శోధింపగా మనోధర్మములని వాటి దలుపబడెను |
జననమరణంబులు జడరూపమైనట్టి దేహధర్మములని దెలియబడెను |
ఇవి షడూర్ములటంచు వివిధమార్గంబుల వివరించి వీటిని విడిచి నిన్ను |
|తేగీ|| సద్గురూక్తంబుగా గన్న సజ్జనుండు నిష్కలబ్రహ్మమైయుండు నిగామవినుత |రమ్య|

34. | సీ|| యెక్కువకులమందు నేజనించితి నాదు కులమెక్కువనుటయు కులమధంబు |
సకలశిష్టాచార సంపన్నుడను నేను శ్రేష్టుండననుటయు శీలమదము |
ద్రవ్యంబు నావద్దదండిగాయున్నది యని గర్వపడుయు ధనమదంబు |
ధరనునావంటి సుందరుడు లేడనినిక్కి రూడిగా దిరుగుట రూపమదము |
|తేగీ|| మదములన్నియూ ఈ దేహమందు విడిచి భక్తి నీ మీద గలవాడు ముక్తుడగును |రమ్య|

35. | సీ|| బలవంతుడను వైసుగలవాడ వైరులన్వధియింతు ననుట యవ్వన మదంబు |
సకలశాస్త్రంబులు చదివివచించి నేయదికుడననుట విద్యామదంబు |
యఖిలదేశాధిపత్యము నాకుగలదని రింజిల్లుచుండుట రాజ్యమదము |
స్నానసంధ్యాద్యనుష్టానుండ నేనని మదినుబ్బుటయు తపోమదము సుమ్మి |
|తేగీ|| యష్టమదములనణచిన నిష్టపరుడు పుణ్య పురుషుండు వైకుంఠపురమునుండు |రమ్య|

36. | సీ|| తలిదండ్రులు భార్య తనయులు మిత్రులు ధనము సహోదరుల్ తనువులైన |
అష్టపాశంబులు నమరి బంధములచే దగిలుండునరుడు ఈ ధరణియందు |
యత్తమామల బావ లల్లుండ్లు కొదండ్లు మరుదండ్లు వదినెలు మరుదులనుచు |
తాపత్రయంబుల దగిలి వర్తింపుచుమత్తులై మనుజులు మందమతిని |
|తేగీ|| సాదుసజ్జన సంగతి సలుపలేక మోక్షమర్గంబెరుంగరు మోహరహిత |రమ్య ||

37. | సీ|| పరమాత్మ నెరుగక తెరుపుమరపులచాత గాత్ర పుత్రకళత్ర మిత్రులందు |
సక్తుడై కడలేని సంసారవార్ధిలో మునిగి తేలుటనెల్లయణవమలము |
పరద్రవ్యమా పేక్షపడి పరజనులకు సపకృతిశేయ మాయామలంబు |
పుణ్యపాపములచే పుట్టుచావులును నిర్మించుచుండుటయు కార్మికమలంబు |
|తేగీ||మూడుమలముల విడువక ముక్తిపథము గానలేరైరి పామరమానవులును |రమ్య ||

38. | సీ|| తాపత్రయంబుల ధర్మముల్ వేర్వేర వివరించి చెప్పెద విమలచరిత |
దేహజన్యములైన త్రివిధరోగంబుల తాపదుఃఖంబు లధ్యాత్మికంబు |
వ్యాళవృశ్చిక చోరవ్యాఘ్రాది భూతసంభవ దుఃఖములు నాది భౌతికంబు |
వర్షాశనీపాత వాయురగ్ని శిలాపతన దుఃఖములు నధిదైవికంబు |
|తేగీ|| నిట్టితాపత్రయంబుల గొట్టివేశి ధీరుడగువాడు మోక్షాధికారి యగును |రమ్య ||

39. | సీ|| కామధర్మార్థముల్ గలుగుటకై భార్య నిచ్ఛయించుటయు ధారేషణంబు |
సుతులులేకున్నను గతులులేవనచు పుత్రేచ్ఛనుండుటయు పుత్రేషణంబు |
దానధర్మములచే తరియింతునని ద్రవ్యమిచ్ఛయించుట ధనేషణంబు |
ధారాది యీషణత్రయముల చాతను యవనిలో సౌఖ్యంబు లనుభవించి |
|తేగీ||పుణ్యలోకంబులెల్లను పొందవచ్చు గాని మీలోన నైక్యమార్గములు గావు |రమ్య ||

40. | సీ|| లోకానుసారియై లౌకికవృత్తుల వసియించుటయు లోకవాసనండ్రు |
శాస్త్రపద్ధతి తపోజపక్రతు వ్రతముల వర్తించుటయు శాస్త్రవాసనండ్రు |
దేహపోషణజేసి తీర్థయాత్రలకెల్ల వడిగదిరుగుట దేహవాసనండ్రు |
నీ మూడువాసన లిచ్ఛయించక దేశికుల సేవజేసి దుర్గుణములణచి |
|తేగీ|| తత్వమస్యాదివాక్య తాత్పర్యమెరిగి తన్నుదాగన్న పురుషుడు ద్వైతుడగును |రమ్య ||

41. | సీ|| వాతంబునం దుద్భవంబైన రోగంబులు దండిగా యెనిమిది పదులునయ్యె |
పైత్యమందుద్భవంబైన రోగంబులు దండిగా యెనబదిరెండు నయ్యె |
శ్లేష్మమందు జనించిన రోగములును యిన్నూట యిరువైనాల్గనుచితమయ్యె |
త్రివిధరోగంబు లీతీరున మున్నూట యెనబదినారునై యెన్నికయ్యె |
|తేగీ|| నట్టివ్యాధుల కాధారమైన దేహభ్రాంతి విడచిన వాడు సద్బ్రహ్మవిదుడు |రమ్య ||

42. | సీ|| ఆత్మయందునమాయ యారోపితంబయ్యె మాయయందజ్ఞాన మపుడుగల్గె |
అజ్ఞానమునదోచె నవివేక మవివేక మందున నభిమాన మమరబుట్టె |
నభిమానమందు రాగాదు లుద్భవమయ్యె రాగాదులందు కర్మంబు బొడమె |
కర్మమువల్లను కడలేని సుఖదుఃఖ మూలమైన శరీరములు జనించె |
|తేగీ|| నీవిధంబున దేహంబులెత్తి జనులు నిన్ను గనలేరు నిరుపమ నిర్మలాత్మ |రమ్య ||

43. | సీ|| రాతిరిపడియున్న రజ్జువంతటజూచి భ్రమసిపామని భయపడినయట్లు |
శుక్తిదూరంబునజూచి వెండియటంచు ప్రబలిన యాశచేభ్రమసినట్లు |
దండకారణ్య మందెండు మొద్దునుజూచి దొంగవాడని భీతిదోచినట్లు |
కలలోనవస్తువుల్ గని మేలుకొని లేచి యావస్తువుల్ వెదకులాడినట్లు |
|తేగీ|| నరులు సత్యము జగమని నమ్మినారు జ్ఞానపథమందు నిజరూపు గానలేక |రమ్య ||

44. | సీ|| జన్మాస్థవృద్ధులు క్షయపరిణామ వినాశములు షడ్విధ వికారములనాత్మ |
ఘనబాల్య యౌవన కౌమార వార్ధక్యములు జాగ్రదాద్యవస్థలు ననాత్మ |
కమనీయ మదహంకార భూజలహుతాశన శమీరాంతరిక్షములనాత్మ |
త్రిగుణముల్ స్థూలాది దేహత్రయంబు లన్నమయాది పంచాకోశములనాత్మ |
|తేగీ|| యంతరింద్రియ బాహ్యేంద్రియము లనాత్మ దృశ్యరూపంబు శ్రుతమును ద్రుక్కనాత్మ |

45. | సీ|| సత్యంబుబ్రహ్మ మసత్యంబు సర్వప్రపంచంబుయని విమర్శించు వాడు |
యిహపర సౌఖ్యంబులిచ్చగింపక నుండి పాపపుణ్యంబుల బడనివాడు |
శమదమంబులు శాంతి శ్రద్ధోపరతి తితీక్షలు సతతంబును గలుగువాడు |
మోక్షంబునందు నపేక్షవిస్తారమేకాని యేయాపేక్షలేనివాడు |
|తేగీ|| గురుకటాక్షంబు చేతను గురుతెరింగి యసిపదంబగు నీయందు నైక్యమగును |రమ్య

46. | సీ|| అంతరింద్రియ నిగ్రహంబు శమంబగు బహిరింద్రియనిగ్రహము దమము |
యరిషడ్వర్గంబు నణచుట శాంతియు సుఖదుఃఖముల సహించుట తితీక్ష |
వేదాంతశాస్త్రముల్ వినివిమర్శించి సద్గురునందు భక్తి గల్గుటయు శ్రద్ధ |
కర్మంబులను బ్రహ్మకర్పించి హృత్పర బ్రహ్మసంగంబు పరతియటంచు |
|తేగీ|| నెరిగి విడచిన వాడు యోగీశ్వరుండు నతడు ముఖ్యుండు నార్యుండు నచలితుండు |

47. | సీ|| కోరుటకామంబు కోరినఅర్ధంబు కొనసాగాకుండిన క్రోధమగును |
వచ్చినద్రవ్యంబు వదలకుండుట లోభమాధనాపేక్ష మోహంబు యగును |
ధనమున్నదని మొదమునసుబ్బి నాకేమి కొదువని గర్వించినది మదంబు |
తనద్రవ్యమపహరింత మనెటి జనులందు మది నీర్షయుంచుట మత్సరంబు |
|తేగీ|| గనుక నీ శత్రువర్గషట్కములణంచి శాంతిజెందిన పురుషుండు సర్వసముడు |రమ్య|

48. | సీ|| సాధన చత్వారిసంపత్తియును గలిగి పరిపూర్ణుండైన సద్గురునిజేరి |
ద్వాదశ సాష్టాంగదండంబు లర్పించి తనుమనః ప్రాణముల్ ధారబోసి |
భక్తితో నాత్మాంగభావసుస్థాన శుశ్రూషలు జేసి సంతోషపరచి |
నట్టి శిష్యుని పిలిచి గట్టిగా గురుమూర్తి త్రివిధదీక్షలొనర్చి దివ్యముగను |
|తేగీ|| హస్తమస్తక సంయోగ మంచితముగజేసి నిజకేవలాత్మోపదేశమొసగు |రమ్య ||

49. | సీ|| యమము నియమ మాసనములు ప్రాణాయామ మమర ప్రత్యాహార మంచితముగా |
ధ్యానధారణసమాధ్యష్టాంగయుత మంత్రయోగము లయహఠ యోగములును |
రాజయోగంబు తారకము సాంఖ్యామనస్కములు ముద్రలు లక్ష్యసాధనములు |
వరతత్వ మస్యాది వాక్యముల్ జీవేశ్వరైక్య సంధానము రాజితముగా |
|తేగీ|| శిష్యునకు తెలిపి గురుమూర్తి స్థిరముగాను పూర్ణభావంబు బోధించుబుధులు మెచ్చ|

50. | సీ|| భూసురుండెవడైన పుణ్యశీలుడు మహానదుల తోయముల స్నానంబుజేసి |
శుభ్రవస్త్రముగట్టి శుచియైన స్థలమందు క్రమముతో కూర్మచక్రము లిఖించి |
దర్భకృష్ణాజిన ధవళాసనములపై పద్మాసనస్థుడై పదిలముగను |
కన్నులు బిగియించి కడువెన్ను నిక్కించి నాసాగ్రమున చూపుజేసి |
|తేగీ|| మనసు కిష్టమైనట్టి మంత్రంబు నిష్టతోను జపముజేసినయోగి విలక్షణుండు |రమ్య|

51. | సీ|| రెప్పలు వాల్చక రెండు చూపుల కనుబొమల మధ్యమునందు పొందనిలిపి |
కర్ణరంధ్రములు గదియంగ బిగియించి యంతరజ్ఞప్తిచే నాలకించి |
గజ్జముద్వల నాద ఘంటారావము శంఖవీణ తాళధ్వనుల్ వేణుభేరి |
మర్ధళమేఘాది మహనీయ దశవిధనాదముల్ విని చాల మోదమంది |
|తేగీ|| నందులోపల తుదినాదమందు మనసులయము జేసినయోగి విలక్షణుండు |రమ్య |

52. | సీ|| అంగుష్టములను కర్ణాంగంబులను మూసి చక్షుల మధ్య తర్జనుల మూసి |
నాశికాయుగ్మ మనామకంబుల మూసి ఘనవక్త్రము కనిష్టకముల మూసి |
పాదమూలంబుల పాయూపవస్థలు మూసి యాధారమున వాయువపుడు లేపి |
షట్చక్రములనున్న సంజ్ఞల కడతేరి యాజ్ఞేయ చక్రమం దమరనిలిపి |
|తేగీ|| చూపు పవనంబు యా మనస్సొకటి జేసి ధ్యానమునాచరింప హఠయోగి ధన్యుడగును |

53. | సీ|| సురుచిరశాంభవి చూడంగ చూడంగ చంద్రసూర్యాగ్నులు నింద్రధనువు |
నవరత్నములభాతి నక్షత్రముల రీతి బిరుసుగాల్చినయట్లు మెరుపువలెను |
మండుమంటలభంగి నిండు చీకటిబోలు పండువెన్నెల కాంతి యెండవలెను |
యిలజలమాదిగా యిట్లనేకము బుట్టి యణగిన పిమ్మట నమలమగుచు |
|తేగీ|| బట్టబయలైన బ్రహ్మంబు గాట్టిగాను వేలయులోపల గనుపడు వేత్తలకును |రమ్య ||

54. | సీ|| ఆసనస్థానమం దాధార చక్రమునందు నాలుగు రేకులమరి యుండు |
**వ – శ – ష – స** లనియెడి వర్ణముల్ నాల్గుండు చతుర్కోణాకార మవని యుండు |
కుంకుమ వర్ణంబు కింకిణినాదంబు నారునూరులు హంస లాడు చుండు |
సద్భక్తియును క్రియాశక్తియు వర్తించు ఘనతరంబుగ నిన్ని గలిగినట్టి |
|తేగీ|| కమలమందున ప్రేమతో విమలమైన నీవు గణపతి రూపమై నిలచినావు |రమ్య ||

55. | సీ|| ఆధారమునకు రెండంగుళంబుల మీద లింగస్థలబుండు రంగుగాను |
స్వాదిష్టచక్రము షడ్దళంబుల నర్ధ చంద్రాకార మమరి యుండు |
**బ – భ – మ – య – ర – ల –** లుండు పాటిల్లునైష్టిక భక్తినీరము జ్ఞానశక్తి యుండు |
విమల విద్యుత్కాంతి వీణారవంబును నార్వేలు హంసలు నాడుచుండు |
|తేగీ|| ప్రకటితంబుగ వికశిత పద్మమందు నీవు బ్రహ్మస్వరూపమై నిలచినావు |రమ్య ||

56. | సీ|| మరియు నాభిస్థానమందున మణిపూరకము దశదళములు గలిగియుండు |
డఢలాది పాంతము దృడముగా అక్షరములు పదివేణునాదంబు ప్రబలియుండు |
శ్యామల వర్ణమిచ్చాశక్తి త్రికోణమగ్ని భూతంబు దాన్నంటియుండు |
నవధానభక్తియు నచట కుండలిస్థాన నార్వేలు హంసలు నాడుచుండు |
|తేగీ|| నిన్నియుండిన చక్రమంధిష్టముగను నీవు విష్ణుస్వరూపమై నిలచినావు |రమ్య ||

57. | సీ|| హృదయస్థలమందు హితము గానాహత పద్మమందున దళాల్ పదియు రెండు |
కఖలాదిఠాంతము ఘనతరాక్షరములు పదియు రెండు యుండును బాగుగాను |
షట్కోణమాకార వాయుభూతము నాదిశక్తియుండును భవభక్తియుండు |
శాంత కుంభవు కాంతి శంఖారవంబును నార్వేలు హంసలు నాడుచుండు |
|తేగీ|| భరితమైయున్న చక్రాధిపత్యము గను నీవు రుద్ర స్వరూపమై నిలచినావు |రమ్య ||

58. | సీ|| తాలుమూలలయందు స్థానంబుగా విశుద్ధాంబోజముండు సుందరముగాను |
పదియారు దళములు బాగుగా షోడషస్వరములుండును పరాశాక్తియుండు |
ఆకశాబూతంబు స్వానంద భక్తియు వర్తులాకారంబు స్పటికకాంతి |
మోదంబుతో మేఘనాదంబు మ్రోయంగ హంసలు దశశతం బాడుచుండు |
|తేగీ|| భాసురంబుగ నానందభరితమగుచు నీవు ఈశ్వర రూపమై నిలచినావు |రమ్య ||

59. | సీ|| నాసాగ్రవీధిని నయనద్వయంబుల నడుమ నాగ్నేయంబు నమరియుండు |
రెండురేకులు దానికుండు మీదను రెండు హంక్షంబులనియెడి యక్షరములు |
నబ్ధి నాదంబు మహత్తత్వ భూతంబు మాణిక్య కాంతి సమరస భక్తి |
గంగా సరస్వతి సంగమ స్థానంబు హంసలు పదినూర్లు నాడుచుండు |
|తేగీ|| శ్రీకరంబుగ నట సదాశివమయస్వ రూపమైనావు నీవు సంరూఢముగను |రమ్య ||

60. |సీ|| సరసహస్రార చక్రము మూర్ధస్థలం బందుయుండు విలక్షణముగా నందు |
వేయి రేకులింపొందుగా వర్తించు సాక్షిభూతము సహజాత్మశక్తి |
ఓంకార బీజము ఝుంకార నాదము బహుచిత్రవర్ణము పరమభక్తి నమృతంబు |
నెప్పుడు దతివృష్టిగా గురియు హంసలు దశశతంబాడుచుండు |
|తేగీ|| నందు నిరుపమ సచ్చిదానందముగను నీవు సద్గురు రూపమై నిలచినావు |రమ్య ||

61. |సీ|| కొండమీదను పెద్దగుండునొక్కటియుండు గుండు నడుమను నల్లగుండ్లు రెండు |
గుండ్ల మధ్యను నక్క కూతలు బెడుచుండు కూతలనడుమను నూతియుండు |
నూతి మధ్యన నాతియొక్కతెయుండు నాతిమీదను నొక్కకోతియుండు |
కోతిమీదను పరంజ్యోతి వెల్గుచునుండు జ్యోతియే జగమెల్ల జూచుచుండు |
|తేగీ|| చూచుచుండేడిదానందు చోద్యమెరిగి నదియు తాననియున్నవాడాత్మవిదుడు |

62. |సీ|| విమల చిన్మయనేత్రకమల మధ్యంబున మార్తాండ సోమాగ్ని మండలములు |
మండలంబులయందు మహనీయముగా నొక్క నీలమేఘంబుండు నిజముగాను |
మేఘమధ్యంబున మెరుపు మెరయుచు నుండు నందు నీవారశూకాగ్రముండు |
శూకాగ్రమున నతిసూక్ష్మ స్వరూపమై బహిరంతరంబులప్రజ్వరిల్లి |
|తేగీ|| వెలుగుచున్నావు నేకమై వేరులేక నిర్మలాకార నిరుపమ నిర్మలాత్మ |రమ్య ||

63. |సీ|| జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియములైదు ప్రాణాదులైదు శబ్దాదులైదు |
ఘనమనోబుద్ధ్యహంకార చిత్తంబులు నాల్గుగూడిరువది నాల్గుతత్వ |
ములగూడి ధవలశ్యామల రక్తపీతవర్ణములు నాలుగు గల్గి నదియు ప్రకృతి |
నది క్షరంబది క్షేత్రమది జడంబది దృశ్యమది యవిద్యాజ్ఞానమదియనాత్మ |
|తేగీ|| నదియే జీవంబునది దేహమది జగంబు నదియు సంసారమది బంధ నరకమదియు|

64. |సీ|| శ్వేతరక్తాశిత పీతవర్ణంబుల నడుమను నీలవర్ణంబు యుండు |
నదినీలతోయదమగు దాని నడుమ నిర్వాతదీపము కాంతి రీతి యుండు |
నదియు విద్యుర్లేఖ నదియు నాపోజ్యోతి నదియు నోంకారంబు నక్షరంబు |
నది మేరుశిఖరంబు నదియు కైలాసంబు నది సత్యలోకంబు నాశ్రయంబు |
|తేగీ|| నదియువైకుంఠపదము తత్పదము నదియు నదియుత్వంపద మంతరార్థంబు నదియు|

65. |సీ|| శ్వేతరక్తాసితపీత నీలంబుల నడుమన నివాసమైనావు నీవు |
మానితా దిత్య సోమాగ్ని మండలముల నడుమ నివాసమైనావు నీవు |
పొందుగా కళ నాదబిందు త్రయంబుల నడుమ నివాసమైనావు నీవు |
విమల భగీరథీ యమునా సరస్వతీ నడుమ నివాసమైనావు నీవు |
|తేగీ|| అండపిండాడ బ్రహ్మాండ భాండములను నడుమయున్నావునీవు యానందముగను|రమ్య

66. |సీ|| ధరణిలో తిలలందు తైలముండినరీతి దారువుయందున్న దహనురీతి |
నాణెమౌ దధియందు నవనీతమున్నట్లు పుష్పమందున గంధమున్నయట్లు |
రంజిల్లు ఫలమందు రసము గల్గినభంగి చేల మందున్నట్టి నూలు భంగి |
తారహారాదుల దారముండిన తీరు యిసుక రాళ్ళందున్న యినుము తీరు |
|తేగీ|| నఖిల జగముల సకలదేహంబులందు నిండి యున్నావు ఈ రీతి నిజముగాను |రమ్య |

67. |సీ|| నాతల్లి నాతండ్రి నాసతుల్ నాసుతుల్ నాపశుసంఘంబు నాగృహంబు |
నాభూషణంబులు నావాహనంబులు నాక్షేత్రపాత్రముల్ నాధనంబు |
నాధాన్యమని పల్కినపుడు పురుషుండు తానవిగాకవేరైన విధము |
నాశరీరంబును నాయింద్రియంబులు నాజీవధర్మముల్ నాగుణంబు |
|తేగీ|| లనుచు బలికిన దేహేంద్రియాదులకును నీవు వేరుగనుందువు నిశ్చయముగ|రమ్య|

68. | సీ|| యిదిఘటం బిదిపటం బిదిమఠం బిదిహఠం బిదిశఠం బిదిభఠం బిదియటంచు |
నిదిమనం బిదిజనం బిదిధనం బిదిఘనం బిదిదినం బిదివనం బిదియటంచు |
నిదిహయం బిదిప్రియం బిదివ్రయం బిదినయం బిదిజయం బిదిభయం బిదియటంచు |
నిదిశరం బిదికరం బిదినరం బిదిపురం బిదిపరం బిదిస్థిరం బిదియటంచు |
|తేగీ|| నిదియునదియును నదియునునిదియటంచు నెరిగి యెరుగని యెరుకలో యెరుకనీవు|

69. | సీ|| యిది యపశబ్దంబు నిదిసుశబ్దంబని యెరిగిన యెరుకలో యెరుక నీవు |
యిది యుష్ణమిది శీతమిది మృదుత్వంబని యెరిగిన యెరుకలో యెరుక నీవు |
యిదిశుక్ల మిది రక్త మిదియు కృష్ణంబని యెరిగిన యెరుకలో యెరుక నీవు |
యిది మధుర మిది యామ్ల మిది లవణంబని యెరిగిన యెరుకలో యెరుక నీవు |
|తేగీ|| యిదిసుగంధంబు దుర్గంధ మిదియటంచు యెరుగుచుండిన యెరుకలో యెరుక నీవు|

70. | సీ|| నీవు పృథివియుగావు నీరగ్నులునుగావు మారుతముగావు వ్యోమంబుగావు |
శ్రోత్రత్వక్కులుగావు నేత్రజిహ్వాలుగావు ఘ్రాణంబుగావు వక్త్రంబుగావు |
పాదపాణులుగావు పాయుపస్థలుగావు ప్రాణముల్ గావు శబ్దంబుగావు |
స్పర్శరూపులుగావు పరగ రసమునుగావు గంధంబుగావు చిత్కళలుగావు |
|తేగీ|| మానసాదులుగావు కర్మములుగావు సచ్చిదానంద రూపాత్మ సాక్షినీవు |రమ్య ||

71. | సీ|| షట్చక్రములుగావు షడ్వర్ణములుగావు కామాదిశత్రువర్గములు గావు |
షట్కోశములుగావు షడ్భ్రములుగావు షడ్వికారంబుల సరణిగావు
షట్కసంపత్తులు షడ్గుణంబులుగావు వరషడూర్ములుగావు క్షరముగావు |
షణ్మతంబులుగావు షట్పాత్రములుగావు షట్కర్మములుగావు సత్తుగావు |
|తేగీ|| సప్తధాతువులునుగావు సప్తకోటిమంత్రములుగావు యానందమయుడవీవు |రమ్య |

72. | సీ|| అష్టతనువులుగావు యష్టాత్మలునుగావు అష్టాంగయోగాది నిష్ఠగావు |
అష్టమూర్తులుగావు అష్టపురంబులు గావష్టమదములుగావు నీవు |
అష్టాబ్జములుగావు అష్టపాశంబులు అష్టస్థలంబులు నరయగావు |
దశరంధ్రములుగావు దశనాడులునుగావు దశ వాయుగుణసమంధములుగావు |
|తేగీ|| పంచశక్తులుగావాది ప్రకృతిగావు సర్వపరిపూర్ణచైతన్య సాక్షివీవు |రమ్య ||

73. | సీ|| తత్పదంబును నీవు త్వంపదంబును నీవు నశిపదంబును నీవు నాత్మవీవు |
అండాండములు నీవు పిండాండములు నీవు బ్రహ్మాండములు నీవు బ్రహ్మనీవు |
సత్తుచిత్తులు నీవు సాక్షిరూపము నీవు క్షరుడువు నీవు యక్షరుడ వీవు |
క్షేత్రంబులును నీవు క్షేత్రజ్ఞుడవు నీవు కర్మంబులును నీవు జ్ఞానమీవు |
|తేగీ|| స్థూలదీర్ఘంబులును నీవు సూక్షమీవు నీవు నేనను నేవైన భావమీవు |రమ్య ||

74. | సీ|| విశ్వసృష్టిని నీవు విశ్వేశ్వరుడవు నీవు విశ్వవంద్యుడవీవు విశ్వమీవు |
వేదవేద్యుడవీవు వేదాంతుడవు నీవు వేదస్తుడ వీవు వేదమీవు |
యజ్ఞకర్తవు నీవు యజ్ఞాభోక్తవు నీవు యజ్ఞారూపుడ వీవు యజ్ఞమీవు |
దేవదేవుడవీవు దేవాత్మకుడవీవు దైవజ్ఞుడవునీవు దైవమీవు |
|తేగీ|| శిష్యుడువు నీవు పరమదేశికుడ నీవు సగుణనిర్గుణుడవు నీవు సాక్షివీవు |రమ్య ||

75. | సీ|| అవనినీరంబులో నైక్యంబుగా జేసి నానీరమగ్నిలో నైక్యపరచి |
నాయగ్నివాయులో నైక్యంబుగా జేసి నావాయుగగనమం దైక్యపరచి|
గగనంబు మహదహంకారంబులో గల్పి తదహంకృతియు మహత్తత్వమందు|
నైక్యంబుగజేసి నా మహత్తత్వంబు నద్వయ బ్రహ్మమం దైక్యపరచి |
|తేగీ|| నట్టి యోగీంద్రుడద్వయుండ ప్రమేయు డప్రతర్క్యుండ నంతుడు నఖిలసముడు |రమ్య|

76. |సీ|| బ్రహ్మమందా త్మైక్యభావంబు దెలిశితే నజ్ఞాన వృత్తులు నణగుచుండు |
నజ్ఞాన వృత్తులు నణగినపిమ్మట నవివేక వృత్తులు నణగుచుండు |
నవివేక వృత్తులు నణగినపిమ్మట నభిమాన వృత్తులునణగుచుండు |
నభిమాన వృత్తులు నణగినపిమ్మట రాగాదులెల్ల విరాగమౌను |
|తేగీ|| రాగములు బోయినపుడు కర్మములు దొలగు కర్మములుదొలగ నిర్మల జ్ఞానియగును|

77. |సీ|| శ్రవణేంద్రియంబుల శబ్దముల్ వినుచుండు చర్మేద్రియంబులా స్పర్శలెరుగు |
చక్షురింద్రియముల వీక్షించురూపముల్ రుఢిగా జిహ్వేచే రుచులనెరుగు |
ఘ్రాణ రంధ్రంబుల గంధమాఘ్రాణించు వాక్కుల వచియించు వాక్యములను |
యేజ్ఞానమున నిన్ని టెరిగే నాజ్ఞానంబు ప్రజ్ఞానమని శ్రుతుల్ బలుకుచుండు |
|తేగీ|| నట్టి ప్రజ్ఞానలక్ష్యార్థ మనుభవంబు నీ స్వరూపంబు నిక్కంబు నిజపథంబు |రమ్య ||

78. |సీ|| భారతీపతి రమాపతి పార్వతీపతి వాసవాద్యఖిల దేవతలయందు |
మానవాశ్వ గవాది మశపిపీలికాంతము జీవులందు చైతన్యమొకటి |
యట్టిచైతన్యమే యాత్మ బ్రహ్మంబనే పదమునకు లక్ష్యార్థభావ మిదియు |
కమలజాది పిపీలికాంత శరీరముల్ వాచ్యార్థమని వాటి వదిలి తేను |
|తేగీ|| యా పరబ్రహ్మ చైతన్యమాత్మలనేటి వార్తబేదంబులే గాని వస్తువొకటి |రమ్య ||

79. |సీ|| పరిపూర్ణమయ్యున్న పరమాత్మ బ్రహ్మ యోగ్యమైన కాయంబునందు |
బుద్ధికి సాక్షియై స్ఫురియింపుచున్నది యహమనే పదమున కర్థమగును |
ప్రతిలేనిద్వైస్వతః పరిపూర్ణ పరమాత్మ బ్రహ్మశబ్దమున కర్థంబునిదియు |
అహమేవ బ్రహ్మబ్రంహ్మైవాహనమనియన్న యస్మ్యనే పదమున కర్థమనుచు |
|తేగీ|| నెరిగి వాచ్యార్థములనెల్ల పరిహరించి యనుభవజ్ఞానిబొందు లక్ష్యార్థమందు |రమ్య|

80. |సీ|| మరియు సృష్టికి పూర్వమందద్వితీయమై నామరూప క్రియ లేమిలేక |
ఏకమై యచలమై ఏదియుండునోనది తత్పద లక్ష్యతాత్పర్యమిదియు |
తన వివేకమున సాధన చతుష్టయములు గలిగిన పుర్ణాధికారియందు|
ధీమానో చిత్తాది దేహేంద్రియములక తీతమై సాక్షియై తేజరిల్లు |
|తేగీ|| నదియు త్వంపద లక్ష్యార్థమనగనొప్పు నసిపదార్థంబు నీ రెంటికైక్యమరయ |రమ్య |

81. |సీ|| స్వచ్ఛమై సత్యమై స్వప్రకాశంబునై యాపరోక్షమై సదా యమల మగుచు |
నాద్యంత రహితమై యచలమై నిత్యమై శుద్ధమై బుద్ధమై సిద్ధమగుచు |
నిర్వ్యాజ్యమైనట్టి నిర్గుణం బయమాత్మ పదముకు లక్ష్యతాత్పర్య మిదియు |
ప్రతిలేనిదై నిరుపద్రవంబై స్వతః పరిపుర్ణమై బట్టబయలు నగుచు |
|తేగీ|| జగదధిష్టానమై చరాచరములందు బాధితములేక యున్నదే బ్రహ్మమగును |రమ్య ||

82. |సీ|| అల చతుర్వేద మహావాక్యములయందు నీవే బ్రహ్మవు బ్రహ్మనీవేయనుచు |
యుపనిషద్భాష్యంబు లూహించి వెదకిన నీవే బ్రహ్మవు బ్రహ్మనీవేయనుచు |
యోగ శాస్త్రములలో యుక్తి సాదించిన నీవే బ్రహ్మవు బ్రహ్మనీవేయనుచు |
మంత్ర శాస్త్రంబుల మర్మముల్ దెలిపిన నీవే బ్రహ్మవు బ్రహ్మనీవేయనుచు |
|తేగీ|| వేదవేదాంత సిద్ధాంతవేత్తలెల్ల నిశ్చయింతురు నిత్యంబు నిగమవినుత |రమ్య ||

83. |సీ|| వరబ్రహ్మ క్షత్రియ వైశ్యాది వర్ణముల్ నీకు నెన్నడు లేవు నిశ్చయముగా |
నలబ్రహ్మచర్యాది యాశ్రమధర్మముల్ నీకు నెన్నడు లేవు నిశ్చయముగ|
స్వగత విజాతి స్వజాతి భేదంబులు నీకు నేన్నడులేవు నిశ్చయముగ|
కులనామరూపముల్ గోత్రసూత్రంబులు నీకు నెన్నడు లేవు నిశ్చయముగ|
|తేగీ|| ఖేదమోదంబులును వాదభేదంబులును నీకు నెన్నడులేవయ్యా నిశ్చయముగ |రమ్య|

84. | సీ|| జలజపత్రమునందు సలిలమంటనియట్లు నద్దమందున రూపమంటనియట్లు |
ఖురద యాకుమ్మరిపురుగు కంటనియట్లు నాజ్యంబు జిహ్వాయందంటనట్లు |
ఘువిచింతపండుపై బొబ్బరంటనియట్లు బలుచల్లలో వెన్న గలిగినయట్లు |
చిత్రభానుండును చీకటంటనియట్లు నాకాశమును వాయువంటనట్లు |
|తేగీ|| బ్రహ్మవేత్తలు మాయా ప్రపంచమందు నఖిల వ్యవహారములు జేసి యంటరధిప |రమ్య |

85. | సీ|| సకల దేశములందు సకల కాలములందు సకల వస్తువులందు చలనలేక |
చావుపుట్టుకలేని ఈ వుత్తబట్టబైలే కాని రెండోది లేదు లేదు |
కలలోనగనుగొన్న గజము మెల్కొనిచూడ లేశమైనను ఏమిలేని భంగి |
భ్రమయుక్తమైన మూలములేని ఈ గుర్తెరిగే శరీరము ఏమిలేదు|
|తేగీ|| యిదియు గురువాక్య పద్ధతి విదితముగను విమరిశించినవాడు వివేక ఘనుడు |రమ్య |

86. | సీ|| ఈ వుత్త బట్టబైలేమి లేదనుచును ద్వాదశాక్షరిచాల దరుచవలెను |
మూల మింతయులేక మేలుగా నెరిగెడి ఈ శరీర ద్వయమేమిలేదు |
యని గురువాక్యంబు విని సంతతము యాది నుంచంగ వలెనిది కొంచమనక |
నది నిశ్చయముజేసి యిది విడిపించితే పరిపూర్ణ మైయుండు బాధ లేక |
|తేగీ|| రాకపోకలు రెండును లేకయుండు నట్టి సూత్రంబు దెలసిన అచలమగును |రమ్య |

87. | సీ|| అవనిలో నీరులో నగ్నిహోత్రంబులో మారుతమందు వ్యోమంబులోను |
సురులలో నరులలో గిరులలో చరులలో తరులలో హరులలో కరులలోను |
ఊళ్ళలో గూళ్ళలో రాళ్ళలో రోళ్ళలో లేళ్ళలో కోళ్ళలో తేళ్ళలోను |
గోడ్లలో గుడ్లలో బుడ్లలో వడ్లలో చీమలో దోమలో పాములోను |
|తేగీ|| యచలమై యుండు కాలత్రయంబులందు  భాదితము లేక కేవల బ్రహ్మముండు |రమ్య |

88. | సీ|| సృష్టికి పూర్వము సృష్టికి పరమందు సృష్టి యున్నప్పుడు సృజనలేక |
సకల దేశంబుల సకల కాలంబుల సకల వస్తువుల చంచలము లేక |
ప్రాగ్ధక్షిణంబుల పశ్చిమోత్తరముల నాల్గు మూలల మీద నడుమ క్రింద |
అచలమై సత్యమై యాద్యంత శూన్యమై పరిపుర్ణమై బట్టబయలుగాను |
|తేగీ|| ఏకమైయుండు ఏ బాధ లేకయుండు నట్టి వస్తును కేవలాత్మనగబడు |రమ్య ||

89. | సీ|| సగుణ నిర్గుణములు సద సత్తులును నిరాకార సాకారముల్ గానిదేదో |
క్షేత్రజ్ఞ క్షేత్రముల్ జీవ జగంబులు కారణ కార్యముల్ గానిదేదో
పాపపుణ్యంబులు బంధమోక్షంబులు జ్ఞానకర్మంబులు గానిదేదో
క్షరమ క్షరంబులు సత్యమసత్యముల్ ఖండమ ఖండముల్ గానిదేదో |
|తేగీ|| రాకపోకలు జెప్పంగ రానిదేదో నదియు కేవల పరిపూర్ణమనగనొప్పు |రమ్య ||

90. | సీ|| వసుధలో నణగాదు వార్ధిలో మునగాదు గాఢాగ్నిచేత దగ్దంబుగాదు |
గాలికి గూలదు కరముల జిక్కదు పాషాణములనైన పగిలిపోదు |
వానకు దడువదు వడగండ్ల నొవ్వదు యస్త్ర శస్త్రంబుల హతముగాదు |
యెండకు యెండదు యుండ నీడకు రాదు ఘనపాశములనైన గట్టుపడదు |
|తేగీ|| చలికి వణకదు భయములకులికిపడదు యచలమైయుండు పరిపూర్ణమమలచరిత |

91. | సీ|| బాధితంబైన ఈ ప్రకృతి ద్వయములేని కేవల పరిపూర్ణ భావమునకు |
స్థూల దేహములేదు సూక్షదేహములేదు కారణ దేహ సంఘటనలేదు |
ఘనమహాకారణ ఘటము లేనే లేదు లేదు జాగ్రదవస్థ లేదు లేదు |
లేదు స్వప్నావస్థ లేదు నిద్రావస్థ లేదు తుర్యావస్థ లేదు లేదు |
|తేగీ|| సర్వమీశ్వరతను చతుష్టయములేదు విశ్వతైజస ప్రాజ్ఞాది విభులు లేరు |రమ్య ||

92. | సీ|| పుట్టదు గిట్టదు పట్టదు ముట్టదు కొట్టదు తిట్టదు కట్టు పడదు |
యెరుగదు మొరుగదు కరుగదు యొరుగదు పెరగదు విరగదు తరుగుబడదు |
యాడదు పాడదు వాడదు యోడదు వేడదు గూడదు జూడబడదు |
యదరదు బెదరదు గదరదు చదరదు ముదరదు వదరదు గదలబడదు |
|తేగీ|| జనదు పెనగదు చినగదు వినదు కనదు ఖేదమోద ద్వయములేని కేవలాత్మ |రమ్య |

93. | సీ|| సర్వకాలము చలించక నొక్కతీరుగా పరిపూర్ణమైయున్న బట్టబయలు |
పతిగాదు సతిగాదు రతిగాదు ప్రతిగాదు స్తుతిగాదు యుత్పత్తి స్థితియు గాదు |
మృతిగాదు స్మృతిగాదు శృతిగాదు ధృతిగాదు కృతిగాదు వికృతిహంకృతులుగాదు |
క్షితిగాదు మతిగాదు మితిగాదు ద్యుతిగాదు యతిగాదు మూల ప్రకృతియుగాదు |
|తేగీ|| గతియు దుర్గతి గాదు సద్గతిగాదు గతము విగతముగాదు యాగతముగాదు |రమ్య |

94. | సీ|| నేత్ర జిహ్వ ఘ్రాణ శ్రోత్రత్వగింద్రియంబుల కేవలాత్మను దెలియరాదు |
శ్వేతవర్ణముగాదు పీతవర్నముగాదు రక్తనీలాది వర్ణములుగాదు |
కటులవణామ్లతిక్త కషాయ మధురాది రసరుచి వస్తు వర్గములుగాదు |
వీణారవము గాదు వేణునాదముగాదు తాళమృదంగాది ధ్వనులుగాదు |
|తేగీ|| విమలపరిమళ మిళిత ద్రవ్యములుగాదు కఠిన శీతోష్ణ మృదుసదాగతులు గాదు |రమ్య |

95. | సీ|| ఆద్యంతములు లేని యచలము రెండో ప్రకారంబు నెన్నడు గాకయుండు |
క్రిందటగాలేదు ముందరగాబోదు ఇప్పుడుగాలేదు యికనుగాదు |
సర్వకాలంబేక సరళిగా కదలక మెదలక వదరక బెదరకుండు |
ఈప్రపంచంబునకు పరిపూర్ణంబునకును సంబందమెన్నటికిలేదు |
|తేగీ|| చావుపుట్టుక లలరె నీ జగమునకు చావుపుట్టుక లేనిది కేవలాత్మ |రమ్య ||

96. | సీ|| ఆదిమధ్యాంత శూన్యం బైనదానందు పంచభూతములు జన్మించలేదు |
బంధముక్తులులేని పరిపూర్ణమందు ఈ పంచకోసములుద్భవించ లేదు |
జ్ఞానకర్మంబులులేని వస్తువుయందు ప్రకృతి ద్వయంబులుత్పత్తి లేదు |
యచలమునందు మాయావిద్యలాది యుపాధి ద్వయంబులుద్భవము లేదు |
|తేగీ|| జగము జీవులు స్థావరజంగమములు బట్టబయలందు నెన్నడు బుట్టలేదు |రమ్య ||

97. | సీ|| సురలు రాక్షసులు భూసురులు వైద్యులు శూద్ర నరులు మౌనులు దిగంబరులు |
ఋషులు యోగులు భోగులు రోగులు త్యాగులు తరులు ఖేచరులు వానరులు గిరులు |
రాజులు మంత్రులు రథ తురగంబులు శరచాపధరులు భీకరులు కరులు |
కలలో ననేకమెక్కడి నుండి వచ్చెనో గాని మేల్కొనిన నొక్కటియు లేదు |
|తేగీ|| నీ ప్రపంచంబు నా రీతి నేమిలేదు బట్టబయలైన యచల మెప్పటికి నుండు |రమ్య ||

98. | సీ|| క్షరమక్షరంబులు సగుణ నిర్గుణములు సత్యమసత్యముల్ సత్తుచిత్తు |
కారణ కార్యముల్ జ్ఞానకర్మంబులు పురుషుండు ప్రకృతియు యెరుకమరుపు |
పాపపుణ్యంబులు బంధమోక్షంబులు జనన మరణంబులు జడమజడము |
క్షేత్రజ్ఞ క్షేత్రముల్ జీవదేహంబులు మానాభిమానముల్ మంచి చెడుగు |
|తేగీ|| యిట్టి ప్రకృతి ద్వయంబులు గట్టిగాను బట్టబయలందు యెన్నడు బుట్టలేదు |రమ్య|

99. | సీ|| చైతన్య మనియన్న క్షేత్రజ్ఞుడనియన్న జ్ఞానమనియన్నహంకారామన్న |
సద్రూపమనియన్న చిద్రూపమనియన్న సస్వరూపంబన్న సాక్షియన్న |
ఈస్వరుడనియన్న నిలవిష్ణువనియన్న పరమాత్మయనియన్న బ్రహ్మమన్న |
యాదిశక్త్యనియన్న యానందమనియన్న పరమ పదంబన్న ప్రకృతియన్న |
|తేగీ|| మాయకేయిన్ని బహునామ ధేయములును బట్టబయలందు నొకపేరు బుట్టలేదు |రమ్య

100. |సీ|| బ్రహ్మకల్పంబులు ప్రతియుగంబులు గాదు సంవత్సరములు మాసములు గాదు |
పక్షముల్ తిథివార నక్షత్రములుగాదు గ్రహయోగకరణ లగ్నములు గాదు |
పర్వముల్ ఋతువులు పగలు రాత్రులు గాదు వెలుగుచీకటి మేఘములును గాదు |
ఉదయాస్తమయములు నుపరాగామును గాదు త్రివిధకాలముగాదు దిశలుగాదు |
|తేగీ|| నాదబిందువు కళగాదు నభముగాదు జీవనిర్జీవులు గాదు కేవలాత్మ |రమ్య ||

101. |సీ|| కర్తృత్వ భోక్తృత్వ స్ఫూర్తత్వ మంత్రత్వములు కేవలాత్మకు గలుగవెపుడు |
జ్ఞాతృత్వ శ్రోతృత్వ ఘ్రాతృత్వ వక్తృత్వములు కేవలాత్మకు గలుగవెపుడు |
ధ్యాతృత్వ వేతృత్వ ధాతృత్వ పాత్రత్వములు కేవలాత్మకు గలుగవెపుడు |
శత్రుత్వ మిత్రత్వ జైత్రత్వ భేతృత్వములు కేవలాత్మకు గలుగవెపుడు|
|తేగీ|| గోత్రసూత్రా పవిత్రగాత్ర ములును నిజకేవలాత్మకు గలుగవెపుడు |రమ్య ||

102. |సీ|| దయభయధైర్య శ్రద్ధా లజ్జా శమ దమ దర్పాహంకారేచ్ఛదంభ దైన్య |
మదలోభమోహ కామక్రోధ మాత్సర్య సుఖదుఃఖ క్షయ వృద్ధి క్షుత్పిపాస |
సంశయ నిశ్చయ సంకల్ప వికల్ప కంపనాకుంచనా గమన చలన |
శ్వాస నిశ్వాస విసర్గ వ్యాపకరాగ ద్వేష కుటిల గర్వ వేషభాష |
|తేగీ|| వినయ మానాభిమానాది విషయసంఘములును నిజకేవలాత్మకు గలుగవెపుడు |రమ్య|

103. |సీ|| ఈ వుత్తబట్ట బైలేమీ లేదనువాడు రాగిగాడతడు విరాగిగాడు |
యెరిగే శరీరము ఏమి లేదనువాడు జ్ఞానిగాడతడు యజ్ఞానిగాడు |
యున్న దున్నట్లుగా నుండ జూచెడు వాడు కర్మిగాడతడు దుష్కర్మిగాడు |
లేనిమాయా విద్యలేమి లేవనువాడు ఘనుడు గాడతడు కించనుడుగాడు |
|తేగీ|| అనృతమైనట్టి జగములేదన్నవాడు బంధ మోక్షద్వయంబుల బడని వాడు |రమ్య ||

104. | సీ|| ఈ వుత్త బట్టబైలేమిలేకను సదా పరిపూర్ణమైయ్యుండు ప్రకృతిలేదు |
కలలోన గనుగొన్న గజమేమి లేనట్టు యెరిగె శరీరము ఏమీలేదు |
యిదియే గురువాక్యంబు యింతకంటెను యెక్కువైన వాక్యంబు యెందైనలేదు |
యిది రాజమార్గంబు యిది యనాయాసంబు యిది భ్రాంతిరహితంబు యిది స్థిరంబు
|తేగీ|| యిదియు నమ్మిన వారల కేమి బాధలేదు జన్మంబు మరణంబు లేదు లేదు |రమ్య ||

105. | సీ|| బ్రాహ్మణోత్తములైన పరగ క్షత్రియులైన వైశ్య శూద్రులునైన వాంఛగలిగి |
ఈ నురు పద్యమ్ములింపుగావిని వ్రాసిచదివిన జనులకు సౌఖ్యములును |
ధనధాన్యములు వస్త్ర కనక భూషణములు సతి సుతుల్ హితబంధు సంఘములును |
గజతురగంబులు ఘనమైనపశువర్గ మాండోళనము శుభం బతిథిపూజ |
|తేగీ|| లాయురారోగ్య భాగ్యంబు లమరి సుఖము గలిగియుందురు మోక్షంబు గలుగు నిజము|

106. | సీ|| శ్రీకర లోకప్రసిద్ధుడై పరశురా మాన్వయాంభోధి హిమాంశుడైన |
కూలంకషజ్ఞాన కోటీశ్వరునకు శ్రీ సుబ్బమాంబకు నేను సుతుడనయ్యు |
నరసింహదాసుండ నని పేరు విలసిల్లి యమల కంభాలూరి యప్పగురుని |
కరుణాకటాక్షంబు గలిగి వేదాంతార్థ సారము లెస్సగా సంగ్రహించి |
|తేగీ|| భరితముగా నూటయెనిమిది పద్యములను ప్రేమతో జెప్పిమీకు నర్పించినాను |రమ్య

107. | సీ|| ఇంపుగాజెప్పిన ఈ నూటయెనిమిది మహనీయపద్యముల్ మౌక్తికములు |
ప్రాస మిశ్రమములు బంగారు కొలుకులు కూర్మి శబ్దంబులు గూర్చుటంబు |
పరమ తత్వార్థము పచ్చల పతకంబు మీయంకితంబును మేరుపూస |
ఈ రీతి మౌక్తికహారంబు జేసినే ముదముతో నర్పించి మ్రొక్కినాను |
|తేగీ|| కంఠమందున ధరియించి ఘనతమెరసి నన్ను రక్షించు నినుసదా నమ్మినాను |రమ్య|

108. |సీ|| దశరథ సుకుమార దానవసంహార మందర నగధీర మంగళంబు |
నీరజదళనేత్ర నీలతోయదగాత్ర మౌనిజనస్తోత్ర మంగళంబు |
భానుజవర్ధన భక్తజనార్ధన మారీచమర్ధన మంగళంబు |
కమలామనఃఖేల కాంచన మయచేల మహనీయ కులశీల మంగళంబు|
|తేగీ|| మన్మథాకార రఘువీర మంగళంబు మాధవానంద గోవింద మంగళంబు|
రమ్యగుణధామ భద్రాద్రిరామ పరశురామ నరసింహదాస సంరక్షితాహ్వ|

ఇది శ్రీమద్రాజాధిరాజ మహారాజ రాజయోగీంద్ర చంద్రులగు

శ్రీమత్ పరశురామ నరసింహదాస

విరచిత శ్రీ భద్రాద్రిరామ శతకము పరమతత్వ సీసపద్యములు

సంపూర్ణము

సర్వం సద్గురు చరణారవిందార్పణమస్తు

# గురు పూజ దినోత్సవము

1. **శ్రీ శ్రీధర స్వామి** - కార్తీక శుద్ధ ఏకాదశి నాడు బయలులో కలసిరి
2. **శ్రీ శివ రామ దీక్షితులు** – విరోధిక్రుత నామ సం!! కార్తీక శుద్ధ దశమి శనివారం నాడు పరిపూర్ణ బయలులో ఐక్యమైరి.
3. **శ్రీ గురు అప్పలార్యులు** - నందన నామ సం!! శ్రావణ బహుళ దశమి నాడు బట్టబయలు లో లీనమైరి
4. **శ్రీ పరశురామ సీతారామ స్వామి** – పరిదావి నామ సం!! వైశాఖ బహుళ అమావాశ్య గురువారం నాడు నిజమైన కేవలాత్మ లో ఐక్యమైరి.
5. **శ్రీ శేషమాంబ** – బాద్రపద శుద్ధ తదియనాడు బయలులో కలిసిరి.
6. **శ్రీ భారలింగ ప్రభువు** – శోభకృతు నామ సం!! జ్యేష్ట శుద్ధ దశమి గురువారం రోజు కుంఠితం లేని వైకుంఠమను దానిలో ఐక్యమైరి .
7. **శ్రీ రామ బ్రహ్మం గారు** – శ్రావణ శుద్ధ తదియ నాడు పరిపూర్ణ బయలులో చేరిరి.
8. **శ్రీ సత్యమాంబ గారు** – ఆషాడ బహుళ షష్టి నాడు పరిపూర్ణ మనే బయలులో కలిసిరి.
9. **శ్రీ సుగుణాకర దేశికేంద్రులు** – చైత్రశుద్ధ షష్టి నాడు బయలులో కలిసిరి.
10. **శ్రీ మాధవ దేశికేంద్రులు** – పుష్య శుద్ధ దశమి నాడు బయలులో కలిసిరి.
11. **శ్రీ రామచంద్ర రావుగారు** – ప్రజోత్పత్తి నామ సం!! పుష్య శుద్ధ పాడ్యమి ఆదివారం 5 – జనవరి – 1992 (౦౫ – ౦౧ – ౧౯౯ ౨) నాడు ఐక్యమైరి.
12. **శ్రీ రామచంద్ర రెడ్డిగారు** – శ్రీముఖ నామ సం!! బాద్రపద శుద్ధ అష్టమి గురువారం 23 – ఆగష్టు – 1993 (౨౩ – ౦౮ – ౧౯౯ 3) నాడు మధ్యాహ్నం 2-00 గ!! ఐక్యమైరి.